# మీ సొత్తు మీ పరం



రచన:
మహ్మోద్ కలీమ్ సిద్దిఖి



అనంత కరుణామయుడు, అపార దయామయుడైన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

## నన్నుక్షమించండి

ప్రియ పాఠకులారా! నన్ను క్షమించండి. నేను నా తరపు నుండి, ముస్లిం సమాజం తరపు నుండి క్షమాపణ కోరుతున్నాను. ఎందుకంటే ముస్లిములు మానవాళికి శత్రువయిన షైతాన్ వలలో చిక్కుకుని తమ వద్ద సొత్తుగాఉన్న మీ గొప్ప సంపదను మీ వరకు చేరవేయలేదు. ఆ షైతాన్ – పాప పంకిలమైన మనిషి హృదయంలో తిష్టవేసిప్రపంచాన్నంతా యుద్ధ మైదానంగా మార్చివేశాడు. ఈ తప్పిదాన్ని గుర్తించి నిస్వార్ధంతో ప్రేమ, మానవత్వానికి సంబంధించిన విషయాలు మీతో చెప్పాలనివాటిని మీకు అందజేస్తున్నాను.

నిజ యజమాని అయిన అల్లాహ్ మానవుల సంకల్పాలు తెలిసినవాడు. ఈ పుస్తకాన్ని మీదాక చేరవేయడంలో నేను నిస్వార్ధపరుడనయి, నిజమైన అనురక్తితో నిర్వర్తించదలిచానని అయనకు తెలుసు. ఇన్నాళ్ళుగా ఈ విషయాలను మీకు తెలియజేయనందుకు నాకు ఎన్నో రాత్రులు నిద్ర దురమయింది. మీకూ ఒక మనసుంది. అది ఎంతో స్వచ్ఛమైనది సత్యాన్ని దాచివేస్తే అది ఎంత వ్యాకులతకు గురవుతుందో దానిని అడగండి.

## ఇదొక ప్రేమవాణి

ఇది నేను చెప్పవలసింది కాదు కానీ నా మాటలు ప్రేమ వాణికి సంబంధించినవి. వాటిని మీరు మీ మనో నేత్రాలతో చదవాలని నా అభిమతం. సర్వాన్ని సృష్టించి ఆ సృష్టిని నడుపుతున్న యజమానిని మీరు గనుక గుర్తించినట్లయితే నా ఆత్మకు శాంతి లభిస్తుంది. నా సోదర సోదరీమణులకు వారి సొత్తును అందజేసి ఒక సోదరునిగా నా కర్తవ్యాన్ని నెరవేర్చానని భావించుకుంటాను.

మనిషి ఈ ప్రపంచంలోకి వచ్చిన తరువాత సత్యాన్ని తెలుసుకుని దానిని విశ్వసించడం తప్పనిసరి, ఇంకా ఇది అతడి కర్తవ్యం కూడా, నేను ఆ సత్యాన్ని మీకు వినిపించదలిచాను.

## ప్రపంచంలో అన్నింటికన్నా గొప్ప సత్యం

ఈ ప్రపంచంలోనే కాదు, ప్రకృతిలోనూ గొప్ప సత్యం ఏమిటంటే ఈ

సృష్టిని సృష్టించినవాడు, దానిని నడిపించేవాడు కేవలం ఒకే ఒక్క ప్రభువు, ఆయన తన అస్తిత్వం (ఉనికి)లో, గుణగణాలలో ఒకే ఒక్కడు. ప్రపంచాన్ని సృష్టించడంలో, మృత్యువునివ్వడంలో, ప్రాణం పోయడంలో అయనతో పాటు మరొకరెవరు భాగస్వామి లేడు. అయన ప్రతి ఒక్కరి మొరను వినేవాడు. శక్తిగలవాడు. ప్రతి ఒక్కరిని చూసేవాడు.

సృష్టిలోని ఒక్క ఆకు కూడా ఆయన ఆజ్ఞ లేనిదే కదలదు. అంతేకాదు మనిషి ఏ ధర్మాన్ని అచరించే వాడయినా, లేక విగ్రహారాధకుడయినా సరే, ప్రతివాని అంతరాత్మ అసలైన పోషణకర్త, నిజ ప్రభువు కేవలం ఒకే ఒక్క దేవుడని సాక్ష్యం పలుకుతూ విశ్వసిస్తోంది.

మానవుని ఆలోచనలో కూడా సర్వ సృష్టికి కర్త ఒక్కడేనన్న స్ఫురణ కలుగుతోంది. అది ఎలా అంటే ఒక కాలేజీకి ఇద్దరు ప్రిన్సిపాళ్లు ఉన్నట్లయితే ఆ కాలేజీ నడవజాలదు. ఒక గ్రామానికి ఇద్దరు గ్రామాధికారులు ఉన్నట్లయితే గ్రామ పరిపాలన సవ్యంగా సాగదు. ఒక దేశానికి ఇద్దరు రాజులు ఉండరు. మరి, ఇంత పెద్ద సృష్టికి పాలకుడు ఒక్క దేవునికంటే ఎక్కువ ఎలా ఉండగలరు ? అనేక పరిపాలకులు ఉంటే సృష్టి ఎలా నడవగలుగుతుంది ? సృష్టిలో అనేక మంది పరిపాలకులు ఎలా ఉండగలుగుతారు ?

## ఒక దృష్టాంతం

ఖుర్ఆన్ దైవవాణి. అందుకే అది ఇలా సవాలు చేస్తోంది:" .... అది మా గ్రంథం అవునో కాదో అని మీకు సందేహం ఉన్నట్లయితే దానివంటి ఒక్క సూరా* నైనా మీరు రచించి తీసుకురండి. మీ సహచరులందరినీ పిలుచుకోండి. ఒక్క అల్లాహ్ తప్ప మరెవరి సహాయాన్నయినా పొందండి. మీరు సత్యవంతులే అయితే." (అల్ బఖర : 23)

పధ్నాలుగు వందల సంవత్సరాల నుండి ఈనాటి వరకు ప్రపంచ ప్రజలు, సైన్స్, కంప్యూటర్ మొదలయిన వాటిని పరిశోధించే వారు దివ్య ఖుర్ఆన్‌ను కూడా పరికించి అలసిపోయారు. చివరికి వారు తమ తలలు దించుకున్నారే గాని, ఎవరు కూడా ఇది దేవుని గ్రంథం కాదని చెప్పడానికి సాహసం చేయలేకపోయారు.

మానవులు అర్థం చేసుకోవడానికి సృష్టికర్త ఈ పవిత్ర గ్రంథంలో అనేక

* "సూరా" అంటే దివ్యఖుర్ఆన్ లోని ఒక అధ్యాయం



దృష్టాంతాలను పేర్కొన్నాడు. అందులో ఒక దృష్టాంతం: "ఒకవేళ భూమిపై, ఆకాశాలలో అనేక దేవుళ్ళు (యజమానులు) గనుక ఉన్నట్లయితే కల్లోలాలు చెలరేగుతాయి." అనిచెప్పిన ప్రకారం ఒకరికంటే ఎక్కువ మంది యజమానులు ఉన్నాట్లయితే కలహాలు జరుగుతాయి. ఒకరు ఇప్పుడు రాత్రిగా మారుస్తానంటే మరొకరు పగలుగా మారుస్తానంటాడు. ఒకరు ఆరు మాసాలకు ఒక దినంగా మారుస్తానంటే మరొకరు మూడు మాసాలకు ఒక దినంగా మారుస్తానంటాడు. ఒకరు సూర్యుణ్ణి పడమర నుండి ఉదయింప జేస్తానంటే, మరొకరు తూర్పునుండి ఉదయింప జేస్తానంటాడు ఒకవేళ దేవీ దేవతలకు ఇలాంటి అధికారాలు ఉన్నాట్లయితే వారు అల్లాహ్ కార్యకలాపాలలో పాలుపంచుకున్నట్లయితే ఎలా జరుగుతుందో ఒక ఉదాహరణ ఇస్తాను. అనేక మంది దేవుళ్ళు వర్షం కోసం వరుణ దేవుణ్ణి పూజించి వరం పొందుతారు. అప్పుడు మహా దేవుని తరపు నుండి ఇప్పుడిప్పుడే వర్షం పడకూడదని ఉత్తర్వు వస్తుంది. ఫలితంగా ఆ అనేక మంది దేవుళ్ళు సమ్మె చేస్తారు. పగలెందుకు కావడం లేదని వేచి చూస్తున్న ప్రజలకు సూర్యుడు సమ్మె చేస్తున్నాడని తెలుస్తుంది. ఇలా జరగడం సంభవం కాదా ?

## నిజమైన సాక్ష్యం

నియమానుసారంగా నడుస్తున్న సృష్టికి దేవుడు కేవలం ఒక్కడేనని, అందులోని ప్రతి వస్తువు సాక్ష్యమిస్తోంది. ఆయన ఎప్పుడు ఏదనుకుంటే అది చేయగలడు. అలాంటి శక్తిశాలి విగ్రహాన్నీ మనం తయారు చేయలేము. అయనను మన కల్పనలో గాని, మన ఊహలలో గాని సాకారం చేయలేము. అయన విగ్రహాన్నీ మనం తయారు చేయలేము. ఆయన సృష్టిని మానవుల సేవ కోసం సృష్టించాడు. సూర్యుడు, వాయువు, మనిషి సేవ కోసం సృష్టించబడ్డాయి. భూమి కూడా మనిషి సేవ కోసమే, అగ్ని, నీరు, జీవరాశులు సృష్టిలోని ప్రతివస్తువు మనిషి సేవ కోసమే సృష్టించి మానవుణ్ణి వాటికి నాయకుడిగా నియమించడం జరిగింది, కానీ మనిషిని మాత్రం తన దాసునిగా, తనను అరాధించే వానిగా తన ఆజ్ఞాపాలనకు తలదాల్చేవానిగా సృజించాడు.

న్యాయంగా చెప్పాలంటే, సృజించినవాడు, ప్రాణం పోసేవాడు; ప్రాణం తీసేవాడు, జీవించడానికి కావలసిన ప్రతి వస్తువును ఇచ్చేవాడు ఆయన అయినప్పుడు మనిషన్నవాడు తనకు జీవితాన్ని, జీవితానికి సంబంధించిన

వస్తువులను ప్రసాదించిన వాని ఇష్టప్రకారమే వినియెగించాలి. ఒక వేళ తన ఏకైక ప్రభువు ఆజ్ఞను పాలించకుండా జీవితం గడుపుతున్నట్లయితే అలాంటి మనిషి నేనూ మనిషేనే అని చెప్పుకోవడం భావ్యమా ?

## ఒక గొప్ప సత్యం

నిజ యజమాని తన సత్య గ్రంథం ఖుర్ఆన్‌లో: "ప్రతి ప్రాణి మరణాన్ని చదివిచూడవలసి ఉంది. తరువాత మీరందరూ మా వైపునకే మరలి రావలసిఉంది."అనే ఒక సత్యాన్ని మనకు తెలిపాడు. (అన్ కబూత్: 58)

ఈ ఆయత్*లో రెండు భాగాలున్నాయి. ఒకటి : ప్రతి ప్రాణి మరణాన్ని రుచి చూడవలసిన ఉంది. ఈ విషయాన్ని ప్రతి ధర్మం. ప్రతి సమాజం, ప్రతి ప్రదేశంలోని మనిషి విశ్వసిస్తాడు. అంతే కాదు. నాస్తికుడు సయితం ఈ సత్యం ముందు తల వంచుతాడు. ఇంకా జంతువు కూడా మరణం తథ్యం అన్న నిజాన్ని అర్థం చేసుకుంటుంది. ఎలుక పిల్లిని చూసి పరుగిడుతుంది. కుక్క కూడా రోడ్డు పై దూసుకు వస్తున్న వాహనాన్ని చూసి పరుగు పెడుతుంది. ఎందుకంటే చస్తామన్న సత్యం వాటికీ తెలుసు.

## మరణానంతరం

ఈ అయత్ రెండవ భాగంలో దివ్య ఖుర్ఆన్ ఒక గొప్ప సత్యం వైపు మనల్ని అకర్షిస్తోంది. ఒకవేళ దానిని మనిషి అర్థం చేసుకున్నట్లయితే సృష్టిలోని వాతావరణమే మారిపోతుంది. ఆ సత్యం ఏమిటంటే "మీరు మరణించిన తరువాత నా వైపునకే తిరిగి వస్తారు. ఇంకా ప్రపంచంలో మీరు ఎలాంటి కర్మలయితే చేశారో పరలోకంలో దానికి తగిన ప్రతిఫలాన్నే పొందుతారు" అనేది.

మరణించాక మీరు కుళ్ళిపోతారు. అయితే మళ్ళీ బ్రతికింపబడతామా అనే సంశయం మాత్రం అవసరం లేదు. అయితే మనిషి ఆత్మ మళ్ళీ ఒక యోనిలోకి ప్రవేశిస్తుందనే దృష్టి కోణమే మన అలోచనలకు పరీక్ష పెడుతోంది.

మొదటి విషయం ఏమిటంటే పునర్జన్మ గురించి వేదాలలో లేదు. కానీ తరువాతి పురాణాలలో దీని ప్రస్తావన ఉంది. దీని వల్ల అవగతమయ్యేదేమంటే, తండ్రి నుంచి కుమారుడికి మళ్ళీ ఆ కుమారుడి నుంచి అతడి కుమారుడికి

* "అయత్" అంటే దివ్యఖుర్ఆన్ వాక్యం.



గుణాలు శుక్ల కణాల ద్వారా అనువర్తిస్తాయని రాసి ఉంది. ఈ అలోచన ప్రారంభం ఎలా అయిందంటే షైతాన్ (రాక్షసుడు) ధర్మం పేరుతో ప్రజలను ఉచ్చనీచాలలో బంధించాడు. ఫలితంగా ధర్మ రక్షకులమని చాటుకున్నవారు ధర్మం పేరు పై శూద్రులతో సేవ చేయించుకొని, వారిని నీచులగా చూసినపుడు వారు: "మమ్మల్ని సృజించిన ఆ దేవుడు మానవులందరికి కళ్ళు, చెవులు, ముక్కు వగైరాలన్నింటిని సమానంగా ఇచ్చి సృజించాడు. మరి మీకు మీరు గొప్పవారు గాను, మమ్మల్ని నీచులు గాను, ఎందుకు పరిగణిస్తున్నారు." అని ప్రశ్నించారు. అప్పుడు వారు పునర్జన్మను ఆలంబనంగా చేసుకొని, "మీ పూర్వ జన్మసుకృతం మిమ్మల్ని నీచులుగా చేసింద"ని అన్నారు. ఈ పునర్జన్మ, కల్పన ప్రకారం ఆత్మలన్నీ మళ్ళీ జన్మిస్తూ ఉంటాయి. తమ కర్మల ప్రకారం యోనులూ మారుతూ ఉంటాయి. ఎక్కువ పాపాలు చేసిన వారి ఆత్మలు జంతువుల్లోకి ప్రవేశిస్తాయి. ఇంకా ఎక్కువ చెడ్డ పనులు చెసినవారి ఆత్మలు చెట్ల మొదళల్లోకీ వెళ్ళిపోతాయి. ఎవరైతే పూణ్య కార్యాలు చేస్తారో వారికి మోక్షం ప్రాప్తిస్తుంది.

## పునర్జన్మ గురించి మూడు వ్యతిరేకమయిన తర్కాలు (దృష్టాంతాలు)

1. ఇందులో గొప్ప విషయం ఏమిటంటే, ప్రపంచంలోని పండితులు, సైంటిస్టులు చెప్పేదాన్ని బట్టి భూమిపై అన్నింటికంటే ముందు చెట్లు ఉద్భవించాయి. ఆ తరువాత జంతువులు, ఆ తరువాత కోట్లాది సంవత్సరాలకు మనిషి జన్మించాడు. భూమిపై మనిషి ఇంకా జన్మించని కాలంలో మరి ఏ మనిషి అత్మ కూడా లేనప్పుడు చెట్లల్లో, జంతువులలో ప్రవేశించిన అత్మలు ఎవరివి?

2. మరొక విషయం ఏమిటంటే, ఈ కల్పనను సమ్మతించినట్లయితే భూమిపై మానవుల సంఖ్య నిరంతరం తగ్గుతూ పోవాలి. ఏ అత్మలయితే మోక్షం పొందాయో వారి సంఖ్య తగ్గుతూ ఉండాలి. కానీ ఈ సువిశాలమైన సృష్టిలో మానవుల, జంతువులు, చెట్లు, జీవరాశులు వగైరా అన్నింటా ప్రాణుల సంఖ్యలో నిరంతరం వృద్ధి కనిపిస్తోంది.

3. మూడో విషయం ఏమిటంటే, ప్రపంచంలో జన్మించే, మరిణించే వారి సంఖ్యలో భూమ్యాకాశాలంత వ్యత్యాసం ఉంది. మరణించే వారికి ప్రతికూలంగా జన్మించే చిన్నారుల సంఖ్యే అధికంగా ఉంది. అప్పుడప్పుడు కోట్లాది దోమలు వెల్లువలా ఉద్భవిస్తాయి. కానిచనిపోయే వాటిసంఖ్య మాత్రం అల్పంగానే ఉంటుంది.

అలాగే అక్కడక్కడ కొంత మంది పిల్లలు వారి గత ప్రాంతాలను గుర్తుపడుతున్నారని, గతంలోని తమ పేరుకూడా చెబుతున్నారని, తాము మళ్ళీ జన్మించామని ప్రచారం జరుగుతూ ఉంటుంది. కానీ ఇవన్నీ భూతప్రేతాలు సృష్టించిన విషయాలే. అవి చిన్నారులతో అలా పలికించి మానవులను తమ ధర్మం నుండి తమ విశ్వాసం నుండి దూరం చేస్తూ ఉంటాయి.

వాస్తవం ఏమంటే మనిషి మరణించి తన ప్రభువు వద్దకు వెళ్ళినప్పుడు సత్యం అతని ముందుకు వస్తుంది. ఈ ప్రపంచంలో అతడు ఎలాంటి కర్మలు చేశాడో అ ప్రకారంగా శిక్షగాని,ప్రతి ఫలంగాని పొందుతాడు.

## చేసిన కర్మలకు ఫలితం లభిస్తుంది

సత్కర్మలు చేస్తే, మేలు చేస్తే, ఋజుమార్గం పై నడిస్తే మానవుడు స్వర్గానికి వెళతాడు. ఆ స్వర్గంలో హాయిని పొందే సరంజామా ఉంది. అక్కడ ఎలాంటి సుఖప్రదమైన ఏర్పాటు ఉంటుందంటే వాటిని ఈ ప్రపంచంలో ఏ కన్నూఇంతవరకు చూడలేదు, ఏ చెవీ వినలేదు. ఏ మనసూ అనుభూతి పొందలేదు. అన్నింటికంటే గొప్ప స్వర్గం ఎలాంటిదంటే అక్కడి స్వర్గ వాసులు తమ ప్రభువును కళ్ళారా దర్శించుకుంటారు. దీనికి మించిన ఆనందకర మైన విషయం ఇంకేముంటుంది.

ఇదే ప్రకారం చెడు పనులు చేసిన వారు, పాపాలు చేసిన వారు, ప్రభువు ఆజ్ఞలను ఉల్లంఘించినవారు నరకానికి వెళతారు. వారు అక్కడ అగ్నిలో మండుతూ ఉంటారు. వారు చేసిన ప్రతి పాపానికి దండించబడతారు. అన్నింటికంటే గొప్ప శిక్ష ఏమిటంటే, వారు విశ్వప్రభువును దర్శించలేరు. వారిపై దైవాగ్రహం అధికంగా ఉంటుంది.[1]

## దేవునికి సమానులుగా ఇతరులను సృష్టించడం మహా పాపం

సత్యవంతుడయిన ప్రభువు తన గ్రంథమైన ఖురాన్‌లో సత్కర్మలు, పుణ్యకార్యాలు,సదాచరణలు, చిన్నవిగాను పెద్దవిగాను ఉంటాయని తెలియజేశాడు. ఆ విధంగా ప్రభువు

వద్ద పాపాలు, కుకర్మలు కూడా పెద్దవిగాను, చిన్నవిగానుఉంటాయి.

[1]స్వర్గ నరకాల గురించి తదితర విషయాల గురించి తెలుసుకోవడానికి చదవండి "మర్నెకే బాద క్యాహోగా" రచన: మౌలానా అషిఖ్ ఇలాహి బులంద్‌షహర్



ఇంకా అయన ఇలా తెలియజేశాడు. అన్నింటికంటే ఎక్కువ శిక్షకు గురి చేసేది. ఎన్నటకీ క్షమించనిది, నిరంతరం నరకంలోనే ఉంచేది, మరణం కూడా రానటువంటి గొప్ప పాపం ఏదైనా ఉందంటే అది ఆ ఏకేశ్వరుడైన సృష్టికర్తకు ప్రతికూలంగా మరొకరిని భాగ స్వామిగా చేయడం. పూర్తి దైవ భక్తి కలిగి ఎవరి ముందైనా హృదయపూర్వకంగా తలవంచడం. మరొకరి ముందు చేతులు జోడించడం. ఆయన తప్ప మరొకరు అరాధనకు అర్హుడని నమ్మడం, మరణమిచ్చేవాడు, ప్రాణం పోసేవాడు, ఆహారం ఇచ్చేవాడు, లాభ నష్టాలను చేకూర్చే మరొక యజమాని ఉన్నాడని భావించడం ఘోరమైన పాపం. ఇది గొప్ప అపచారం. ఏ దేవీ దేవతలను నమ్మినా లేక సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలను, లేక ఏ పీరునో, ఏ ఫకీరునో, పూజనీయులుగా భావించడం, షిర్క్.[2] దానిని ఆ ప్రభువు ఎన్నటికా క్షమించడు, షిర్క్‌నుకాక మరే పాపాన్నయినా ఆయన తలచుకుంటే క్షమిస్తాడు. షిర్క్ అనే పాపాన్ని మన మనస్సు సయితం ఘోరమైనదిగా తలుస్తుంది. అంతేకాక షిర్క్‌ను మనమూ ఇష్ట పడము.

## ఒక ఉదాహరణ

ఉదాహరణకు మి భార్య గయ్యాళిదనుకోండి. మాటిమాటికి తిడుతూ ఏ విషయం వినటానికి సిద్ధంగా ఉండదు. అలాంటప్పుడు మీరు ఆమెను గెంటివేస్తానని హెచ్చరిస్తే ఆమే. "నేను కేవలం నీదానను, నీదాని గానే ఉంటాను. నీ గడప లోనే మరణిస్తాను. ఒక్క క్షణమయినా నీ ఇంటి నుండి బయటకు వెళ్ళను." అన్నప్పుడు మీకు ఎంత ఆగ్రహం కలిగినా సరే మీరామెను ఇంటి నుండి గెంటివేయలేరు.

దీనికి ప్రతికూలంగా మి సతీమణీ మీకు బాగా సేవ చేస్తూ మీ అజ్ఞలను పాటిస్తుందనుకోండి. అన్ని వేళలా మిమ్మల్ని కనిపెట్టుకొని ఉంటుందనుకోండి, మీరు అర్ధరాత్రి ఇంటికి వచ్చినా మి కోసం ఎదురు చూస్తూ ఉంటుంది. మీ కోసం భోజనం వేడి చేసి వడ్డిస్తూ ప్రేమగా మాట్లాతుందనుకోండి. ఆమె ఒక రోజు మీతో : "మీరే నా పతి దేవులు. కాని మీ ఒక్కరితో నేను సరిపుచ్చుకోలేను. అందుకని ఈ రోజు నుండి మన పొరుగున ఉన్న అతనిని కూడా భర్తగా అంగీకరిస్తాను. ""అని అన్నదనుకోండి. మీలో ఏమాత్రం మానవత్వం ఉన్నా, మీ రక్తంలో వేడి ఏ మాత్రం ఉన్నా మీరు దానిని భరించలేరు. మి భార్య ప్రాణమయినా

[2] షిర్క్ అంటే నిజప్రభువుతో పాటు మరొకరిని కూడా ప్రభువుగా చేసుకోవడం (అనువాదకుడు)

తీస్తారు. లేదా మీరయినా ప్రాణాలు తీసుకుంటారు.

అసలు ఎందుకిలా? ఎందుకంటే మీ భార్య మరొకరికి భార్యగా ఉండడం మీరు సహించలేరు. మరి ఓ వీర్యకణం నుండి ఉద్భవించిన మీరే మీతో పాటు మరొకరిని భాగస్వామ్యాన్ని చేర్చుకోవడం ఇష్టపడనప్పుడు అల్పమైన వీర్యకణంతో మనుషుల్ని నిరంతరం సృజిస్తున్న ఆ సృష్టికర్త మాత్రం తనకు ఓ భాగస్వామిని ఎలా సహించగలుగుతాడు? తనతో పాటు ఇతరులను పూజించడం ఆయన సహించగలడా? ప్రపంచంలో ఎవరికైనా ఎదయినా దొరికిందంటే అది ఆయన ప్రసాదితచిందే. ఒక వేశ్య తన మానమర్యాదలను అమ్ముకుని, వచ్చే ప్రతి వాడికి తనపై అధికారం ఇవ్వడం వల్ల మనం ఆమెను నీచమైనదిగా భావిస్తాము. అలాగే మనిషి తన నిజ ప్రభువును వదిలి మరొకరిని పూజించినప్పుడు, అంటే ఒక దేవతను గాని లేదా ఒక విగ్రహాన్నిగాని మరే వస్తువును గాని ఆయనకు సాటిగా కల్పించినప్పుడు అతడు దేవుని దృష్టిలో నీచునిగా పరిగణింపబడడా?

## పవిత్ర ఖుర్ఆన్ విగ్రహారాధనను ఖండిస్తోంది.

పవిత్ర ఖుర్ఆన్‌లో విగ్రహారాధన గురించి ఒక ఉదాహరణ ఇవ్వబడింది. అది పరిశీలించాల్సిన అంశం.

"అల్లాహ్‌ను వదిలి మీరు ఏ వస్తువులనయితే పూజిస్తున్నారో అవన్నీ కలసి ఒక్క ఈగనైనా సృష్టించలేవు. సృష్టించడం మాట అటుంచి వాటి ముందున్నప పదార్థాన్నయినా, ప్రసాదాన్నయినా ఈగ తీసుకున్నట్లయితే మళ్ళీ ఈగ నుండి అవి తిరిగి తీసుకోలేవు. పూజించేవారు అశక్తులే. పూజింపబడేవారు అశక్తులే. శక్తి సంపన్నుడయిన అల్లాహ్‌ను వారు గౌరవించవలసిన విధంగా గౌరవించలేదు. ఆయన శక్తిమంతుడు, బలవంతుడూను."

ఇది ఎంత మంచి ఉదాహరణ. సృజించేవాడు స్వయంగా దేవుడయితే విగ్రహాలను మనం దేవుళ్ళుగా చేసుకుంటున్నాము. ఈ విగ్రహాలలో గనుక ఏ కొద్దిపాటి జ్ఞానం ఉన్నా అవి మనల్ని పూజించి ఉండేవి కదా!

## ఒక బలహీనమైన ఆలోచన

కొంతమంది: "మేము వాటిని ఎందుకు పూజిస్తామంటే వారే మాకు నిజదేవుని మార్గం చూపించారు. వారి ద్వారానే మేము నిజ ప్రభువు కారుణ్యాన్ని



పొందుతాము గనుక అని అంటారు. ఇది ఎలాంటి మాటా! ట్రైన్ గురించి ఒక కూలీని అడిగినటువంటి మాట. కూలీ ట్రైన్ గురించి చెప్పినప్పుడు ఆ ట్రైన్ రాకపోతే కూలీ మీద స్వారి చేయడం వంటిది. ఎందుకంటే కూలీ వాడే కదా ట్రైన్ గురించి చెప్పింది అని అన్నటువంటిది. అదే విధంగా నిజ మార్గం దిశ చూపించిన వారిని పూజించడం అంటే ట్రైన్‌ను వదలి కూలీవాని మీద స్వారీ చేసిన విధంగా అనుకోవాలి.

కొంత మంది సోదరులు కేవలం మేము ఏకాగ్రత కోసం విగ్రహాలను పెడతామని అంటారు. ఇది మరీ విడ్డూరం. అంటే ఒక పిల్లాడు తదేకంగా కుక్కను చూస్తూ తండ్రిని తలచుకుంటున్నాను అనిచెప్పడం లాంటిది. తండ్రి ఎక్కడ? కుక్క ఎక్కడా? బలహీనమైన విగ్రహాలు ఎక్కడా? శక్తిశాలి, కరుణామయుడు, దయామయుడయిన ఆ నిజ దేవుడు ఎక్కడ? ఆలోచించండి ఈ క్రియవల్ల ఏకాగ్రత కలుగుతుందా, భంగమవుతుందా ? నిష్కర్షంగా చెప్పాలంటే, ఏ విధంగానైనా నిజ దేవునికి సాటి కల్పించడం అన్నింటికంటె మహా పాపం. దానిని ఆ స్వామి ఎన్నడూ క్షమించడు. అలా చేసిన వ్యక్తి ఎల్లప్పుడు నరకానికి ఇంధనంగా మారవలసి ఉంటుంది.

## విశ్వాసమే ఉత్కృష్టమైనది

అన్నింటికంటే గొప్ప మేలు పుణ్యం ఏదయినా ఉందంటే అది "విశ్వాసం". ప్రపంచంలోని మతావలంబీకులు అనేదేమిటంటే "అన్నింటిని ప్రపంచంలోనే వదలి వెళతాము" అని. నిజమే. కానీ మరణించిన తరువాత మనిషి వెంట వచ్చేది విశ్వాసం. హక్కుదారుడికి అతడి హక్కును ఇచ్చిన వారిని విశ్వాసి అని, హక్కును హరించే వాడిని దౌర్జన్యపరుడు అని అంటారు. మనిషిని సృష్టికర్తకు మనిషిపైహక్కుంది. అందరినీ పుట్టించినవాడు,ప్రాణం తీసేవాడు,ప్రాణం పోసేవాడు అయినదేవుడు పరిపోషకుడు, ఆరాధనకు తగినవాడు, ఆయన ఒక్కడే. అందువల్ల అయననే అరాధించడం మనిషి విధి. ఆయనే యజమాని అని, లాభ నష్టాలు చేకూర్చేవాడని,గౌరవం, అగౌరవం అయన చేతిలోనే ఉందని భావించాలి. ఆయన ప్రసాదించిన జీవితాన్ని ఆయన ఇష్ట ప్రకారం, ఆయన ఆజ్ఞానుసారం మాత్రమే గడపాలి. ఆయననే నమ్మడాన్ని అయన ఆదేశమే వినడాన్ని "విశ్వాసం" అంటారు. మన ప్రభువు ఒక్కడే అని నమ్మకపోతే, ఆయన ఆజ్ఞను శిరసావహించకపోతే

విశ్వాసి కాదు, విశ్వాస ఘాతకుడు అనబడతాడు. ప్రభువు గొప్ప హక్కు (అధికారం)ను కొల్లగొట్టి ప్రజల ముందు నిజాయితీ చూపడం అంటే ఒక దొంగ పెద్ద మొత్తంలో దొంగతనం చేసి, ధనవంతుడయిపోయి వ్యాపారస్తునితో మీ పైసా ఒకటి లెక్కలో ఎక్కువ వచ్చింది. ఇదిగో తీసుకోండి అనడం వంటిది. అంత ధనం దోచుకుని ఒక్క పైస లెక్క చూపడం ఎలాంటి నిజాయితియో అలాగే తన ప్రభువుని వదలి మరొకరిని పూజించడం అర్చించడం అంతకంటె బహు చెడ్డ దుర్మార్గం.

విశ్వాసం ఎలా ఉండాలంటే మనిషి తన యజమాని ఒక్కడే అని నమ్మేలా ఉండాలి. ఆ ఒక్కడినే ఆరాధించాలి. ఆయన ప్రసాదించిన జీవితంలో ప్రతిక్షణం ఆయన ఇష్ట ప్రకారం, ఆజ్ఞ ప్రకారం జీవించాలి. ఆయన ప్రసాదించిన జీవితాన్ని ఆయన ఆజ్ఞ ప్రకారం గడపడమే ధర్మం, ఆయన ఆజ్ఞను ఉల్లఘించడం అధర్మం అనబడుతుంది.

## సత్యధర్మం

సత్యధర్మం మొదటి నుండి ఒక్కటే. అన్ని మతాలు ఒకే దేవుణ్ణి నమ్మాలని. ఆయన ఆజ్ఞలనే పాలించాలని బోధించాయి. పవిత్ర ఖుర్ఆన్‌లో ఇలా ఉంది. "అల్లాహ్ వద్ద ధర్మం కేవలం ఇస్లాం మాత్రమే. ఇస్లాం తప్ప మరొక ధర్మానికి గుర్తింపులేదు. (ఆలి ఇమ్రాన్ : 85)

మనిషిలోని బలహీనత ఏమిటంటే, మనిషి కళ్ళు పరిమిత పరిధి వరకే చూడగలుగుతాయి. అతని చెవులు ఒక హద్దువరకే వినగలుగుతాయి. అతని ఆఘ్రాణ శక్తి, రుచి చూసే శక్తి, స్పర్శించే శక్తులకు కూడా హద్దులు ఉన్నాయి. ఈ పంచేంద్రియాల ద్వారా అతని బుద్ధి పనిచేస్తుంది. అదే విధంగా చేసే పనులకు కూడా పరిమితులు ఉన్నాయి.

ఆ ప్రభువు ఎలాంటి జీవితాన్ని ఇష్టపడతాడు? అయనను ఎలా ఆరాధించాలి? మరణించిన తరువాత ఏం జరుగుతుంది. స్వర్గ నరకాలకు కొని పోయే కర్మలు ఎలా ఉండాలి ? అనేవి మనిషి బుద్ధికి అందనివి. స్వయంగా మనిషి తెలుసుకోలేనివి.

## దైవదూత

అందువల్ల. మానవుని బలహీనతపై దయతలచి ఆ నిజ యాజమాని



యోగ్యులని భావించిన మహా పురుషులకు ఎన్నుకుని వారి వద్దకు దైవదూత ద్వారా తనఅదేశాలను పంపించాడు. వారు ప్రజలకు జీవిత విధానాన్ని, దైవారాధన విధానాన్ని తెలియజేశారు. మనిషి తన జ్ఞానంతో అర్థం చేసుకోలేని జీవిత సత్యాలను వారు తెలియజేశారు. అలాంటిమహా పురుషులను నబీ, రసూల్, పైగంబర్* అని అంటారు. ప్రవక్తలను అవతార పురుషులని కూడా అనవచ్చు. ఎందుకంటే ఆ మహా పురుషులపై దైవవాణి అవతరించింది గనుక. కానీ నేడు అవతరించడం అంటే స్వయంగా నిజ ప్రభువే మానవాకారంలో అవతరించడం అని భావించబడుతోంది. కానీ ఇది మూఢ విశ్వాసమే. ఇదో గొప్పపాపం. ఈ అంధ విశ్వాసమే ఏకేశ్వరోపాసనకు దూరంచేసి విగ్రహారాధన ఊబి లోకి దింపింది.

ప్రజలకు సత్య మార్గం చూపించేందుకు ఏ మహా పురుషులనయితే అల్లాహ్ ఎంచుకున్నాడో, ఎవరినైతే మనం నబీ, రసూల్ అంటున్నామో అలాంటివారిని ప్రతికాలంలో ప్రతి జనవాసంలో, ప్రతి బస్తీలోనూ అల్లాహ్ పంపించాడు. వారందరూ ఒకే దేవుణ్ణి విశ్వసించాలని, కేవలం అయన ఒక్కడినే ఆరాధించాలని ఆయన ఇష్ట ప్రకారం మానవులు జీవించడానికి వారు షరీఅత్ (ధర్మశాస్త్రం) తీసుకువచ్చారు. దానిని.

అనుసరించాలని వారు బోధించారు. వారిలో ఒక్క రసూలయినా సరే ఏకేశ్వరుణ్ణి కాక మరో దేవతను అరాధించాలని బోధించలేదు. వారుఅత్యధికంగా బహు దైవారాధన పాపం నుండి ప్రజలను వారించారు. వారి మాటలను నమ్మి ప్రజలు సత్యమార్గాన్ని అనుసరించారు.

## విగ్రహారాధన ప్రారంభం

అలాంటి సందేశహరులు, వారి అనుయాయులు సయితం మనుషులే.వారూ మరణించారు. (మరణం లేనివాడు కేవలం నిజ దేవుడు మాత్రమే) నబీ, రసూల్ మరణించారని వారిని తలచుకుంటూ బాధతో వారి అనుయాయులు దు:ఖ సముద్రంలో మునిగిపోయేవారు. అప్పుడు షైతాన్‌కు ఒక అవకాశం దొరికింది. షైతాన్ మనిషికి శత్రువు. మనిషిని పరీక్షించడానికి ప్రభువయిన అల్లాహ్ షైతాన్‌కు స్వేచ్ఛనిచ్చాడు. అలాగే మనిషిని ప్రలోభ పెట్టడానికి వారిమనసుల్లో చెడు భవాలు

* "నబీ" అంటే ధర్మశాస్త్రం లభించని ప్రవక్త, "రసూల్" అంటే ధర్మశాస్త్రంలభించిన ప్రవక్త, "పైగంబర్" అంటే సందేశహరుడు (అనువాదకుడు)

నాటే శక్తిని కూడా అల్లాహ్‌యే షైతాన్‌కు ఇచ్చాడు. దానివల్ల దేవుడిని నమ్మేవారెవరు. షైతాన్‌ను నమ్మేవారెవరో అల్లాహ్ మనుషున్ని పరీక్షించి చూడదలిచాడు.

షైతాన్ ప్రజల వద్దకు మీ మహా గురువు (నబి లేక రసూల్) పట్ల మీకు ఎంతో ప్రేమ ఉంది. మరణించిన తరువాత ఆయన మీకు కనిపించకుండా పోయాడు. కనుకనేను ఆయన విగ్రహాన్ని మీ కోసం తయారు చేస్తాను. దానిని చూసి మీరు సంతృప్తి చెందుతారు అని షైతాన్‌విగ్రహాన్ని తయారు చేశాడు. కోరినప్పుడల్లా వారు విగ్రహాన్నిచూసుకునేవారు. క్రమంగా ఆ విగ్రహం పట్ల వారి హృదయాలలో ప్రేమ ఏర్పడ్డాక షైతాన్ వారితో, మీరు గనుక ఈ విగ్రహం ముందు తలవంచినట్లయితే అందులో దేవుడిని పొందగలుగుతారు అన్నాడు. విగ్రహం పట్ల వారి అదివరకేవారి మనసుల్లో పూజనీయ భావం గూడు కట్టుకొని ఉండడం వల్ల వారు దానికి తలవంచి పూజలు చేయడం మొదలుపెట్టారు. మనిషి ఆరాధనకు తగినవాడు కేవలం ఒకే ఒక్క దేవుడు. కానీ వారు ఒక్క దేవునికి బదులుగా విగ్రహాలను పూజించడం మొదలుపెట్టారు. ఇంకా(షిర్క్) బహుదైవారాధనలో మునిగిపోయారు.

ఈప్రపంచ (సర్దార్) నాయకుడ*యిన మనిషి రాళ్ళతో, మట్టితో చేసిన దేవుళ్ల ముందు మోకరిల్లి పూజిస్తుండడం వల్ల అల్లాహ్ దృష్టిలో నీచుడయి ఎల్లప్పటి కోసం నరకానికి ఇంధనమయ్యాడు. అల్లాహ్ మాత్రం తన ప్రవక్తలను పంపిస్తూ పోయాడు. వారు విగ్రహాలను, ఇతరులను ఆరాధించకుండా ప్రజలను నిలువరించడానికి ప్రయత్నించారు. అప్పుడుకొంత మందివారి బోధనలను అనుసరించారు. మరికొందరువారిని కించపరిచారు. ఎవరునమ్మతారో వారిపట్ల అల్లాహ్ ప్రసన్నుడవుతాడు. ఇంకా రసూల్ ఉపదేశాలను అవహేళన చేసినవారి కోసం అల్లాహ్ ఆకాశం నుంచి వినాశకర నిర్ణయాలు చేస్తాడు.

## ప్రవక్తల బోధన

ఒకరి తరువాత ఒకరు నబీ, రసూల్ వస్తూపోయారు. వారి ధార్మికవిధానమంతా ఒక్కటే. వారు ఒకే ధర్మం వైపునకు పిలుపునిచ్చేవారు. ఒకే

* సర్వ సృష్టి రాశులలో ఉత్కృష్టమైన సృష్టిరాశి మానవుడు. ఈ సృష్టిలోని అణువణువు అతని వశం చేయబడింది. అందుకే అతడు ఆకాశాలలో ఎగరగలడు, సముద్రాల లోతులను ఛేదించగలడు, చీమనుండి ఏనుగు వరకు గల జంతువులను తన అధీనం చేసుకోగలడు. అందుకే అతడు ప్రపంచనాయకుడు (అనువాదకుడు)



దేవుణ్ణి విశ్వసించండి. ఆయన అస్తిత్వానికి,గుణగణాలకు సమానంగా ఇతరులను నిలబెట్టరాదు. ఆయనను ఆరాధించడంలోను ఎవరినీ భాగస్వామిగా చేయరాదు. ఆయన ప్రవక్తలందరినీ సత్యవంతులుగా భావించండి. ఆయన దైవదూతలు పవిత్రులు. వారికి ఆకలి దప్పులు ఉండవు. వారు ప్రతి పనిలోనూ అల్లాహ్ ఆజ్ఞలను పాలిస్తారు. అల్లాహ్ తన దైవదూతల ద్వారా ఏ సందేశం పంపినా ఏ గ్రంథాన్నిఅవతరింపజేసినా అవన్నీ సత్యమైనవని విశ్వసించండి. మరణించిన తరువాత మళ్ళీ సజీవమయి తాము చేసిన మంచి చెడుల కర్మల ప్రతిఫలం పొందవలసి ఉందని విశ్వసించండి. అదృష్టమైనా, దురదృష్టమైనా అది అల్లాహ్ ద్వారానే నిర్ణయమైందని గ్రహించండి నేను జీవించే ఏ విధానాలను తీసుకువచ్చానో వాటిని అనుసరించండి. అని ప్రవక్తలు బోధించేవారు.

ఎంతమంది నబీ, రసూల్ వచ్చారో వారందరూ సత్యవంతులు, వారిపై అవతరింపజేసిన ధార్మిక గ్రంథాలు కూడా సత్యమానవే. వాటిపై మనకు విశ్వాసముంది. వాటిపట్ల మేముభేదభావం చూపము. వాస్తవిక సంతులనం ఏమిటంటే, ఎవరయితే దేవుడు ఒక్కడే అని ఆయన వైపు పిలిచారో, ఆయనతప్ప ఇతరులను పూజించరాదని చెప్పారో, స్వయంగా తాము పూజింప బడకుండా ఉన్నారో, అంటే ఏ మహా పురుషుల వద్దనయితే విగ్రహారాధన, బహుదైవారాధన చేసే బోధన ఉంటుందో. వారు ప్రవక్తలు కాజాలరు.

అలా అయితేవారి బోధనలలో మార్పులు చేర్పులు జరిగాయన్న మాట. ప్రవక్త ముహమ్మద్ (స) కంటె ముందు వచ్చిన ప్రవక్తల బోధనలలోనూ, గ్రంథాలలోనూ అక్కడక్కడ మార్పులు చేర్పులు చేయబడ్డాయి.

## అంతిమ ప్రవక్త హజ్రత్ ముహమ్మద్ (స)*

ప్రపంచంలో వచ్చిన ప్రతి రసూల్, నబీ ద్వారానూ, వారి తెచ్చిన గ్రంథాలలోనూ పరమ సత్యం ఒక్కటే. అది, ఒక అంతిమ ప్రవక్త రానున్నాడని చెప్పిన భవిష్యవాణి, అంతిమ ప్రవక్తను గుర్తించిన తరువాత ప్రాచీన ధర్మ శాస్త్రాలన్నింటిని త్యజించి ఆయన బోధనలనుమాత్రమే పాటించాలనీ, ఆయన ద్వారా పంపిన గ్రంథం ప్రకారం జీవించాలనీ చెప్పబడింది. ఈ విషయం సయితం ప్రామాణికంగా సత్యమైనదని ఇస్లాం రుజువు చేస్తోంది.

* "స" అంటే, సల్లల్లాహు అలైహివ సల్లం. అంటే, ఆయనపై శాంతి కురియుగాక అని అర్థం.

ఎలా అంటే ప్రాచీన గ్రంథాలు ప్రక్షిప్తాలకు గురయినప్పటికీ అంతిమ ప్రవక్త వచ్చే సమాచారాన్ని మాత్రం మార్చలేకపోయారు కాబట్టి.

ఈ కారణంగా ధర్మ గ్రంథాల జ్ఞానం ఉన్నవారు. ఈ విషయమై వ్యతిరేకతను వ్యక్తపరచ లేదు. వేదాలలో ఆయన పేరు "నరాశంస్" అని, పురాణాలలో "కల్కి" అవతారం అని, బైబిల్లో "పార్క్లీట్" అహ్మత్ అని బౌద్ధ గ్రంథాలలో "అంతిమ్‌బుధ్" వగైరా రాయబడ్డాయి. ఈ ధార్మిక గ్రంథాలలో ముహమ్మద్ (స) జన్మస్థానం. జన్మతిథి సమయం ఇంకా అనేక వాస్తవ లక్షణాలు పూర్వమే సూచించబడ్డాయి.[2]

## మహో ప్రవక్త జీవిత పరిచయం

దాదాపు 1450 సంవత్సరాలకు పూర్వం అంతిమ ఋషి ముహమ్మద్ (స) సౌది అరేబియాలోని మక్కా నగరంలో జన్మించారు. ఆయన జన్మించటానికి కొన్ని నెలల ముందు ఆయన తండ్రి పరమపదించారు. తల్లి కూడా ఎక్కువ రోజులు జీవించలేదు. ముందు తాతగారు, ఆ తరువాత ఆయన బాబాయి పెంచి పోషించారు, ప్రపంచంలోనే అరుదైన ఈ వ్యక్తి మక్కా నగరవాసులకు ప్రేమ పాత్రులయ్యారు. ఆయన ఎదిగేకొద్ది ప్రజల ప్రేమానురాగాలు మరింత పొందసాగారు. ఆయన సత్యవంతుడని, నిజాయితీపరుడని ప్రజలు తమ సొత్తును ఆయన వద్ద పెట్టేవారు. తమ మధ్య వచ్చేపరస్పర కొట్లాటలను ఆయన వద్ద పెట్టేవారు. తమ మధ్యవచ్చే పరస్పర కొట్లాటలను ఆయన వద్ద పరిష్కరించుకునేవారు. 'కాబా' అనేది మక్కా నగరంలో ఉన్న దైవ గృహం దానిని పున: నిర్మిస్తున్న సమయంలో 'కాబా' గోడలో ఉండే పవిత్రమైన రాయిని మళ్ళి దాని యధా స్థానంలో అమర్చాల్సిన సమయం అసన్నమైనప్పుడు మక్కాలోని ప్రతీ తెగకు చెందిన నాయకులు ఆ భాగ్యం తమకే దక్కాలని కోరుకున్నారు. అందుకోసం పరిస్థితులు కత్తులు దూసుకోవడం వరకు వచ్చాయి. అప్పుడు ఓ తెలివైన వ్యక్తి "అందరికంటే ముందు కాబా గృహంలోకి ఎవరు ప్రవేశిస్తాడో అతడే ఈ విషయంలో నిర్ణయం చేస్తాడు." అని సూచించాడు. దీనిని అందరు సమ్మతించారు. ఆ రోజు అందరికంటే ముందు కాబా గృహంలో ప్రవేశించినవారు మహా ప్రవక్త (స) గారు. అందరూ ముక్తకంఠంతో "వాహ్..... వాహ్....మా మధ్యకు సత్యవంతుడు, నిజాయితీ పరుడైన

వివరాలకు :2 పండిట్ వేద ప్రకాష్ ఉపాధ్యాయ్ రచించి కల్కి అవ్‌తార్ ఔర్ ముహమ్మద్ సాహెబ్, నరాశంస్ ఔర్ అంతిమ్ ఋషి పుస్తకాలు నా కార్యాలయం నుండి పొందవచ్చు. (రచయిత)



వ్యక్తి వచ్చాడు. ఈయన తీర్పు మా అందరికీ అంగీకరమే" అని అరిచారు.

ప్రవక్త (స) గారు ఒక దుప్పటి పరచి దాని లో ఆ పవిత్ర రాయిని ఉంచారు. ప్రతీ తెగ నాయకుడు దుప్పటి అంచును పట్టి తీసుకు రావాలని పరిష్కారం చెప్పారు. ఆ పవిత్ర రాయిని గోడ దగ్గరికి తీసుకురాగానే ప్రవక్త (స) తన స్వహస్తాలతో ఎత్తి దానిని యథా స్థానంలో అమర్చి పెద్ద పోరాటాన్ని నివారించారు. ఈ విధంగా ప్రతి పనికీ ఆయనను ముందుంచేవారు. ఆయన ఎక్కడికైనా ప్రయాణానికి వెళ్ళితే ప్రజలు వ్యాకులతుకు గురయ్యేవారు. తిరిగి రాగానే ఆయనను కలిసి వెక్కి వెక్కి ఏడ్చేవారు.

ఆ కాలంలో అల్లాహ్ గృహమైన 'కాబా' లో 360 విగ్రహాలు ప్రతిష్ఠించి ఉండేవి. మరో వైపు అరేబియా దేశమంతటా ఉచ్చనీచాలు, అంటరానితనం, స్త్రీలపై అత్యాచారాలు, మత్తుపానీయాలు, జూదం, వడ్డీ, కయ్యాలు కార్పణ్యాలు వంటివి అనేకానేక చెడులు ప్రబలి ఉండేవి. అలాంటి పరిస్థితుల్లో అల్లాహ్ తన దైవదూత ద్వారా ఆయనపై ఖురాన్ అవతరింపజేయడం ఆరంభించాడు. ఇంకా ఆయనను ప్రవక్తగా నియమించిన శుభవార్త వినిపించి,ప్రజలందరినీ దేవుని ఏకత్వం వైపునకు పిలువాలనే బాధ్యతను అప్పగించాడు.

## సత్యవాణి

ఆయన (స) ఒకగుట్ట పై నిలుచుండి కేక వేశారు. ప్రజలు ఆ కేక విని గుంపులు గుంపులుగా తరలివచ్చారు. ఎందుకంటే ఆ పిలుపు ఒక సత్యవంతుడు, అమానతుదారుడైన వ్యక్తి పిలుపు కాబట్టి, అప్పుడు ఆయన వారిని ఇలా ప్రశ్నించారు. "ఈ గుట్ట వెనుకనుండి ఒకగొప్ప సైన్యం వస్తుందని, అది మీపై దాడి చేయనున్నదని అన్నట్లయితే మీరు నమ్ముతారా?" అందరూ ముక్తకంఠంతో మీ మాటను అందరూ విశ్వసించేవారే కదా,మీరు ఎన్నడు అసత్యం చెప్పలేదు. పైగా మీరు పర్వతం మరో వైపు కూడా చూస్తున్నారు. గదా!" అన్నారు. ఆ తరువాత ఆయన ప్రజల్ని ఇస్లాం ధర్మం వైపునకు పిలిచారు. విగ్రహారాధనను ఖండించారు. మరణించిన తరువాత నరకాగ్ని ఉంటుందని హెచ్చరించారు.

## మనిషిబలహీనత

మనిషి బలహీనత ఏమిటంటే, అతడు తన పూర్వీకుల తప్పుడు

విధానాలను కూడా అంధ విశ్వాసంతో అనుసరిస్తూ ఉంటాడు. మనిషి బుద్ధి, తర్కం అవి సరైనవి కావని అంటున్నప్పటికీ అతడు పూర్వీకుల పద్ధతినే పాటిస్తుంటాడు. దాని ఫలితంగా అతడు వేరేది చేయడం అటుంచి దానికి వ్యతిరేకమైన మరో మాట వినడానికి కూడా సిద్ధంగా ఉండడు.

## అడ్డంకులు - పరీక్షలు

పై కారణం వల్లనే 40 సంవత్సరాల వయస్సు వరకు ఆయనను ఆదరించినవారు, సత్యవంతుడని చెప్పిన మక్కా వాసులు ఆయన బోధనలకు వ్యతిరేకులయ్యారు. ఆయన ఎంతగా ప్రజలను ఆ సత్యం వైపునకు పిలుస్తున్నారో అంతకు రెట్టింపు ఆయన పట్ల శత్రుత్వం పెంచుకోసాగారు. ముస్లింలుగా మారిన వారిని వేధించినా, కొట్టినా,అగ్నిపై పరుండబెట్టినా, మెడలో త్రాడు వేసి లాక్కొని వెళ్ళినా,రాళ్ళు విసిరి కొట్టినా, ఆయన (స) ప్రతి ఒక్కరి గురించి ప్రార్థించారేగాని ప్రతీకారం తీర్చుకోలేదు. అంతేకాదు,వారు సన్మార్గం పొందాలని ఆయన రాత్రులలో అల్లాహ్‌ను ప్రార్థించేవారు. ఒకసారి ఆయన మక్కావాసుల పట్ల నిరాశ చెంది "తాయెఫ్" అనే నగరానికి వెళ్ళారు. అక్కడి ప్రజలు ఆ మహా పురుషుణ్ణి ఆదరించలేదు. అంతే కాదు వారు కొంత మంది ఆకతాయి కుర్రాళ్ళను పురికొల్పారు. ఆ కుర్రాళ్ళు నానా మాటలంటూ ఆయన (స) పై రాళ్ళు రువ్వారు. ఫలితంగా ఆయన కాళ్ళనుంచి రక్తం కారసాగింది. బాధతో ఆయన (స) ఎక్కడైనా కూర్చుండిపోతే ఆ కుర్రాళ్ళు లేపి నిలబెట్టి మళ్ళీ కొట్టేవారు.ఇలాంటి పరిస్థితిలో ఆయన ఆనగరం దాటి వచ్చి ఒక చోట కూర్చుండిపోయారు. ఆయన (స) వారినిశపించకుండా వారి కోసం దుఆ చేశారు." ఓ ప్రభూ !వారికి సద్బుద్ధిని ప్రసాదించు. వారు ఏమి చేస్తున్నారో వారికి తెలియదు." అని ప్రార్థించారు. ఆయన (స) పవిత్ర సందేశమైన దైవ వాణిని వినిపించిన కారణంగానే తమ ప్రియమైన మక్కా నగరాన్ని విడనాడి మదీనా నగరానికి వలస వెళ్ళవలసివచ్చింది. మక్కాలోని విరోధులు సైన్యం తయారు చేసి ఆయన (స) తో మాటి మాటికి యుద్ధం చేశారు.

## సత్యమే గెలిచింది.

సత్యం ఎల్లప్పుడు విజయమే సాధిస్తుంది. అలాగే ఇక్కడ కూడ సిద్ధించింది. 23 సంవత్సరాల కఠిన పరిశ్రమ అనంతరం ఆయనకు విజయం లభించింది.


ఇంకా సత్య మార్గం వైపు మరలమంటూ ఆయన (స) ఇచ్చిన పిలుపు మొత్తం అరేబియానే ఇస్లాం తన చల్లని నీడలో నిలిపింది. ప్రపంచమంతటా ఓ కాంతి వెలిగిపోయింది. విగ్రహారాధన సమసిపోయింది. అంటరానితనం అడుగంటింది. ప్రజలందరూ ఒక్క అల్లాహ్ నే విశ్వసించి ఆరాదించేవారయ్యారు.

## చివరి వీలునామా

ఆయన మరణానికి కొన్ని సంవత్సరాల ముందు దాదాపు ఒక లక్షా ఇరవై ఆయిదు వేల మంది ముస్లింలతో హజ్ చేశారు. ప్రజలందరికీ తన చివరి వీలునామా వినిపించారు. ఆయన : "ప్రజలారా! మరిణించిన తరువాత కర్మల గురించి ప్రశ్నించే సందర్భంలో నేను అల్లాహ్ ధర్మా(దీన్)న్ని, సత్యాన్ని ప్రజలకు చేరవేశానా లేదా అని నాగురించి ప్రశ్నించబడుతుంది. "అని అన్నప్పుడు అందరూ: "నిస్సందేహంగా మీరు చేరవేశారు." అని ప్రజలు ముక్తకంఠంతో సాక్ష్యం పలికారు. అప్పుడు ఆయన (స) ఆకాశం వైపు వేలెత్తి మూడు మార్లు : "ఓ అల్లాహ్ నీవే సాక్ష్యం నీవే సాక్ష్యం, నీవే సాక్ష్యం, అని పలికారు. ఆ తరువాత ప్రజలను ఉద్దేశించి "ఈ సత్య ధర్మం ఎవరికి అందిందో వారు ఈ ధర్మం చేరని వారి దాకా చేరవేయాలి" అన్నారు. ఆయన ఇంకా ఇలా తెలిపారు, "చివరి ప్రవక్తను నేనే. నా తరువాత మరొక ప్రవక్త రాడు. మీరు ఎదురు చూస్తున్న ఆ అంతిమ ఋషిని నరాశంస్‌ని నేనే, కల్కి అవతరాన్ని నేనే. దీన్ని గురించి మీకు అంతా తెలుసు " దివ్యఖుర్‌అన్ కూడా ఇలా అంటోంది: "నిస్సందేహంగ మేము ఎవరికయితే గ్రంథాన్ని ప్రసాదించామో,వారు తమ కుమారులను ఏ మాత్రం సందేహం లేకుండా గుర్తించే విధంగానే ఈ విషయాన్ని కూడా గుర్తిస్తారు." (అన్ ఆమ్:20)

## ప్రతి వ్యక్తి కర్తవ్యం

ప్రళయం వరకు వచ్చే ప్రతి కర్తవ్యం అతని ధార్మికత, మానవీయ దృక్పథం కేవలం ఒకే ప్రభువును పూజించేదయి ఉండాలి. ఆయనతో పాటు మరొకరిని భాగస్వామిగా చేయరాదు విశ్వసించరాదు. ముహమ్మద్(స)ను అంతిమ ప్రవక్త గాను. సత్యవంతుడు గాను విశ్వసించాలి. ఆయన (స) తీసుకువచ్చిన ఇస్లాం

ధర్మం ప్రకారం జీవించాలి. దీనినే ఇస్లాం ధర్మం "ఈమాన్" * అంటోంది,దీనిని కాదంటే మరణించిన తరువాత నిరంతరం నరకంలోని అగ్ని కీలల్లో జ్వలిస్తూ ఉండవలసి వస్తుంది.

## రెండు ప్రశ్నలు

ఇక్కడ మీ మస్తిష్కంలో రెండు ప్రశ్నలు ఉదయించవచ్చు,మరణించిన తరువాత స్వర్గంలోకి,నరకంలోకి వెళ్ళి విషయం కానరావడం లేదు కదా,వాటిని నమ్మడమెలా? అని.

ఈ విషయంలో తెలుసుకోవలసిందేమంటే, అన్ని ప్రాచీన గ్రంథాలలో స్వర్గం - నరకం గురించి ప్రస్తావించడం జరిగింది. స్వర్గం - నరకం గురించిన విషయం అన్ని ధర్మాల్లో ప్రామాణికమైనది అని తెలుస్తోంది. దీనిని మేము ఒక ఉదాహరణ ద్వారా వివరించదలిచాము. మాతృ గర్భంలో ఉన్న శిశువుతో నీవు గర్భం నుండి బయట పడగానే పాలు త్రాగుతావు, ఏడుస్తావు, ఇంకా గర్భం బయట ఎన్నో విషయాలను చూడగలగుతావు. అని అన్నట్లయితే గర్భంలో ఉన్న కారణంగా ఆ శిశువుకు నమ్మదగిన విషయాలుగా అనిపించవు. కాని గర్భం నుండి శిశువు బయట పడగానే వాటన్నింటిని కళ్ళముందు చూసుకో గలుగుతుంది. అదే విధంగా ప్రపంచమంతా గర్భావస్థలో ఉంది. మరణించిన తరువాత మనిషి పరలోకంలో కళ్ళు తెరవగానే అన్నింటిని తన కళ్ళారా చూసుకుంటాడు. అక్కడి స్వర్గ నరకాల గురించి, ఇతర వాస్తవాల గురించి ఆ సత్యసంధుడు వివరించారు. ఆయన (స) శత్రువులు సైతం అది అసత్యమని చెప్పలేకపోయారు. ఆ సత్యాన్ని దివ్యఖుర్ఆన్ కూడా విశదీకరించింది. దానిని స్వపర అన్న తేడా లేకుండా అందరూ అంగీకరించారు.

## రెండవ ప్రశ్న

మరొక విషయం మీ మదిలో మెదలవచ్చు, అది: ప్రవక్తలందరి ధర్మాలు, ధార్మిక గ్రంథాలు సత్యమైనవే అయితే ఇస్లాం స్వీకరించాల్సిన అవసరం ఏముంది? అని. నేటి ప్రపంచంలో దీనికి సమాధానం చాలా సులువుగా ఇవ్వవచ్చు. మన

* "ఈమాన్" అంటే విశ్వాసం, అంటే నిరాకారుడు, ఏకేశ్వరుడు ఒకే ఒక్క దేవుడని నమ్మడం. ఆయన పంపిన ప్రవక్తలను, చివరి ప్రవక్త ముహ్మద్ (స) ను, పరలోకాన్ని, తీర్పుదినాన్ని, దైవ గ్రంథమైన ఖుర్ఆన్‌ను, దైవదూతలను, స్వర్గనరకాలను విశ్వసించడం. (అనువాదకుడు)



దేశానికిఒక పార్లమేంట్ (సంసద్) ఉంది. ఇక్కడ ఒక వ్యవస్థ ఉంది. మన దేశానికి ప్రధానమంత్రులే వారంతా నిజమైన ప్రధాన మంత్రులయిన. పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ,లాల్ బహదూర్ శాస్త్రీ ఇందిరాగాంధీ, రాజీవ్‌గాంధీ, వి.పి.సింగ్ మొదలయిన వారు సమయానుకూలంగా దేశానికి అవసరమైన చట్టాలు చేసి అమోదించారు. అవన్నీభారత ప్రభుత్వం చట్టాలే. అయితే ప్రస్తుత ప్రధాన మంత్రి, పార్లమెంట్, ఆయన ప్రభుత్వం చట్టంలో ఏమైనా మార్పులు చేస్తే అప్పుడు గతంలోని చట్టాలు చెల్లుబాటు కాకుండాపోతాయి. అందువల్ల ప్రతీ భారతీయ పౌరుడు సవరించిన ఆ కొత్త చట్టాలను అనుసరించక తప్పదు . ఒక వేళ ఏ పౌరుడయినా ఇందిర గాంధియే అసలయిన ప్రధానమంత్రి, నేను అమె చట్టాలను మాత్రమే సమ్మతిస్తాను. ఈ కొత్త ప్రధానమంత్రి చట్టాలను అంగీకరించను.వారు నిర్ణయించిన ట్యాక్స్‌లను చెల్లించను అన్నట్లయితే అందరూ ఆ వ్యక్తిని దేశ ద్రోహి అని అంటారు. అంతేకాక అతడు శిక్షార్హునిగా పరిగణింపబడతాడు. అదే విధంగా ధర్మాలు, ధార్మిక గ్రంథాలు ఆయా కాలల్లో పంపబడి సత్యాన్ని బోధించాయి. కాబట్టి దైవ ప్రవక్తలందరిని, దైవ గ్రంథాలన్నింటిని సత్యమని నమ్ముతూ చివరి ప్రవక్త ముహమ్మద్ (స) ను విశ్వసించడం మానవులకు తప్పనిసరి అయింది.

## సత్య ధర్మం కేవలం ఒక్కటే

ధర్మాలన్నీ దైవానికి చెందినవని. మార్గాలువేరైనా గమ్యం ఒక్కటేనని వాదించడం సరయింది కాదు, సత్యం ఎప్పుడూ ఒక్కటే. అసత్యాలు అనేకం ఉండవచ్చు, సత్యధర్మం మాత్రం ప్రారంభం నుండి ఒక్కటే. ఆ ఒక్క దానిని విశ్వసించడం మాత్రమే ఇస్లాం ధర్మం, ధర్మం ఎన్నటికీ మారదు. కాని షరీఅత్ (ధర్మశాస్త్రా) లు మాత్రం సమయానుకూలంగా మారుతూ వచ్చాయి. మారినా అవి సృష్టికర్త అయిన అల్లాహ్ ఆదేశాల మేరకే మారాయి.

మరిమానవులంతా ఒక్కటే అయినప్పుడు వారి ప్రభువు ఒక్కడే అయినప్పుడు మార్గం కూడా ఒక్కటే అవుతుంది. దివ్యఖుర్ఆన్ మాత్రం "అల్లాహ్ ధర్మం కేవలం ఇస్లాం మాత్రమే" అని అంటోంది.

## మరో ప్రశ్న

మరొక ప్రశ్న కూడా మీ మదిలో మెదలవచ్చు, అది "హజ్రత్ ముహమ్మద్

(స) అల్లాహ్ పంపిన సత్యసంధుడు అని, ప్రపంచానికే ఆయన (స) చివరి ప్రవక్త అనే విషయాలకు సాక్ష్యం ఏమిటి?" అని, వీటికి సమాధానం చాలా సుస్పష్టం, ఖుర్ ఆన్ అల్లాహ్ గ్రంథం. అది తను సత్యమైన గ్రంథాన్నని చేసిన తర్కాలను అందరూ ఆమోదించారు. ఈనాటి వరకు దానిని ఎవరూ వ్యతిరేకించలేదు. హజ్రత్ ముహమ్మద్‌ను సంశయంలేని ఆ గ్రంథం అంతిమ ప్రవక్తగా ప్రకటించింది. మరో విషయం ఏమంటే, ప్రవక్త (స) గారి జీవితానికి సంబందించిన ప్రతి అంశం ప్రపంచం ముందుంది. ఆయన సంపూర్ణ జీవిత చరిత్ర తెరచిన పుస్తకంలా ఉంది. ప్రపంచంలోని ఏ వ్యక్తి జీవిత చరిత్ర కూడా అంత సురక్షితంగా, మహోజ్వలంగా ప్రజల ముందు లేదు. ఆయన శత్రువులు, ఇస్లాంను వ్యతిరేకించే చరిత్రకారులు సైతం ముహమ్మద్ గారు తన వ్యక్తిగత జీవితంలో ఎప్పుడయినా, ఏ విషయంలోనైనా అసత్యం ఆడారని చెప్పలేకపోయారు. ఆయన నగరవాసులు ఆయన సత్యనిష్టపై ప్రమాణాలు చేసేవారు. ఉత్తముడయిన ఆయన తన జీవితంలో ఎప్పుడూ అసత్యం పలకలేదు. అలాంటి ఆయన ధర్మం విషయంలో ఈశ్వరుని విషయంలో అసత్యం ఎలా చెప్పగలుగుతారు. అంతిమ ప్రవక్తనని స్వయంగా ఆయనే చెప్పారు. నా తరువాత ఇక ఏ ప్రవక్త రాడు, ఏ ధర్మమూ రాదు. నా రాక గురించి మునుపటి ప్రవక్తలందరూ తెలియజేశారు. ఆ విధంగా చూస్తే ధార్మిక గ్రంథాలన్నింటిలో అంతిమ ఋషి అని, కల్కిఅవతారం అని చెప్పిన భవిష్య విషయాలు, లక్షణాలు, చిహ్నాలన్నీ కేవలం ముహమ్మద్ గారి విషయంలోనే రుజువు అవుతున్నాయి.

## పండిత్ శ్రీ రామ్ శర్మగారి అభిప్రాయం

పండిత్ శ్రీ రామ్ శర్మగారు ఇలా వ్రాశారు: ఎవరు ఇస్లాం స్వీకరించరో, హజ్రత్ ముహ్మద్ గారిని, ఆయన ధర్మాన్ని అంగీకరించరో అలాంటివారు హిందువు కూడా కాలేడు. ఎందుచేతనంటే హిందువుల ధార్మిక గ్రంథాలలో చెప్పిన కల్కి అవతారం, నరాశంస్ ఈ భూమిపై వచ్చిన తరువాత ఆయన ధర్మాన్ని విశ్వసించాలని చెప్పబడింధి. అందువల్ల ధార్మిక గ్రంథాల పట్ల విశ్వాసం కలిగి ఉండేవారు. ఈ విషయాలనునమ్మాలి. నమ్మకుండా మరిచిస్తే మరణానంతరం జీవితంలో నరకాగ్నికి, దైవ సాక్షాత్కార వంచనకు, దైవాగ్రహానికి గురువుతాడు.

## విశ్వాసం తప్పనిసరి

మరణానంతర జీవతంతో పాటు ఈ ప్రపంచంలో సయితం ఇస్లాం,



ఈమాన్ మనకు అవసరం, అందువల్ల ఒకే దేవుణ్ణి ఆరాధించడం ప్రతి ఒక్కరి కర్తవ్యం. ఆయన గడపను విడనాడి ఇతరుల ముందు తలవంచుతూ తిరిగేవాడు. శునకంకన్నా దిగజారిన వాడు. శునకం తన యజమాని గడప ముందు పడి ఉంటుంది. అతని పైనే ఆశ పెట్టుకుని ఉంటుంది. మరి మనిషి ఎలాంటివాడు? తన యజమానిని మరచి గడపగడపకు తలవంచుతూ పోతున్నాడు. అయితే ఈ విశ్వాసం మరణానంతర జీవితానికి ఇంకా అవసరం, అక్కడి నుండి మనిషి తిరిగి రాలేడు. చావు కావాలని కేకలేసినా

అతనికి చావు రాదు. అప్పుడు బాధ పడితే, పశ్చాత్తాప పడితే ఏమి లాభం లేదు. మానవుడు ఇక్కడి నుండి విశ్వాసరహితుడయి వెళ్ళిపోతే ఎల్లప్పుడూ అగ్నిలో మండవలసిందే, ప్రాపంచిక జీవతంలో శరీరం పై ఒక్క నిప్పురవ్వ పడితేనే మనం తల్లడిల్లిపోతాము. మరి పరలోకం లో ఆ నరకాగ్నిని ఏ విధంగా సహించగలం? అది ఇక్కడి అగ్ని కన్నా డెభ్భైరెట్లు తీక్షణంగా ఉంటుంది. అందులో మండవలసి ఉంటుంది. ఒక చర్మం భస్మం అయితే మరొక చర్మం తొడగబడుతుంది. ఈ శిక్ష నిరంతరం కొనసాగుతూనే ఉంటుంది.

## ప్రియ పాఠకులారా !

ప్రియమైన పాఠకులారా ! మరణ సమయం ఎప్పుడు ఆసన్నమవుతుందో తెలియదు. శ్వాస ఎప్పుడు బయటికి వస్తుందో, బయటపడిన శ్వాస తిరిగి లోనికి వెలుతుందో లేదో తెలియదు. మరణానికి ముందున్న ఈ అతి స్వల్ప సమయంలోనే మీ ప్రథమ బాధ్యతను గురించి ఆలోచించండి ! విశ్వాసంలేని జీవితం జీవితమే కాదు. అలాంటప్పుడు మరణానంతరం వచ్చే జీవితం కూడా జీవితం అనబడదు. రేపు అందరం మన ప్రభువు వద్దకు వెళ్ళవలసి ఉంది. అక్కడ ప్రపథమంగా ప్రశ్నింపబడేది. "విశ్వాసం" గురించే! తీర్పు దినాన మాదాకా నీ సందేశం చేర్చబడలేదు. అని అంటారేమోనని నాకు భయంగా ఉంది.

ఈ సత్య విషయాలు మీ హృదయాలలో నాటుకుపోయాయని నేను ఆశిస్తున్నాను. అయితే భాగ్యవంతులారా! రండి, నిర్మల మనసుగల, స్వచ్ఛమైన ఆత్మగల నా ప్రియ పాఠకులారా! రండి, ఈ సృష్టికి యజమానిని సాక్షిగా నిలిపి ఆయన హృదయాల స్థితిని ఎరిగే వాడని నమ్మి హృదయ పూర్వకంగా విశ్వసించి క్రింది వచనం చదివి సాక్ష్యం పలకుదాం.

"అష్హదు అల్లాఇలాహ ఇల్లల్లాహు
వఅష్హదుఅన్న ముహమ్మదన్ అబ్దుహు
-వ-రసూలుహు సల్లల్లాహు అలైహివ సల్లం"

అర్థం : "అల్లాహ్ తప్ప మరొక దేవుడు ఆరాధనీయుడు కాడని, ఆయన ఒక్కడేనని, ఆయనకు భాగస్వాములు లేరని నేను సాక్ష్యం ఇస్తున్నాను. ఇంకా హజ్రత్ ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వ సల్లం అల్లాహ్ యొక్క దాసుడు, ప్రవక్త అని కూడా నేను సాక్ష్యం ఇస్తున్నాను."

"నేను పశ్చాత్తప పడుతున్నాను. (కుఫ్ర్) తిరస్కారం నుండి షిర్క్ (ఏవిధంగానైనా అల్లాహ్‌తో పాటు మరొకరి భాగస్వామిని చేయడం) నుండి, అన్ని రకాల పాపాల నుండి ఇంకా నేను నన్ను సృజించిన నిజ ప్రభువు ఆజ్ఞలనన్నింటిని పాటిస్తానని, ఆయన ప్రవక్త ముహమ్మద్ (స) ను మనస్ఫూర్తిగా అనుసరిస్తాని ప్రమాణం చేస్తున్నాను." కరుణామయుడు, దయామయుడయిన ప్రభువు మిమ్మల్ని నన్ను మరణించే వరకు ఈ మార్గం పై నడిపించుగాక! నా ప్రియపాఠకులారా! మీరు మరణించేవరకు విశ్వాసంతో నమ్మకంతో జీవితం గడిపినప్పుడు మీ ఈ సోదరుడు ఎలాంటి హక్కును నిర్వర్తించాడో మీకే తెలుస్తుంది.

## విశ్వాస పరీక్ష

ఇస్లాం స్వీకరించడం వల్ల, విశ్వాసం ప్రకటించడం వల్ల మీరు పరిక్షింపబడవచ్చు కూడా. అయినా ఎల్లప్పుడూ విజయం సత్యానిదే అయింది. ఇక్కడ కూడా సత్యమే గెలుస్తుంది. జీవితాంతం పరీక్షింపబడినా ఈ ప్రాపంచిక జీవితం కొన్ని రోజుల వరకే పరిమితం. కాబట్టి మరణించిన తరువాత లభించే నిత్యజీవితం, అక్కడి స్వర్గం, అందులోని భోగ భాగ్యాలను అనుభవిస్తున్నట్లు ఒక్కసారి ఊహించుకోండి. మన యజమాని ప్రసన్నత పొందడానికి, సాక్షాత్తు ఆయనను దర్శించడానికి ఈ పరీక్షలు పరీక్షలే కావు.

## మీ కర్తవ్యం

మరొక విషయం: ఇస్లాం -విశ్వాసాల ఈ సత్యం ఎవరికయితే చేరలేదో వారిదాకా ఈ హక్కు చేరాలి. మరి మీ కర్తవ్యం ఏమిటంటే, మీరు నిస్వార్థంగా మీ సోదరుడి పట్ల సానుభూతి కలిగి, అల్లాహ్ కోపానికి గురికాకుండా, నరకాగ్ని



నుండి, శిక్షనుండి తప్పించడానికి దు:ఖం, బాధలు భరించి ప్రవక్త ప్రజలకు చేరవేసిన సందేశాన్ని మీరు కూడా వారిదాకా చేరవేయండి. వారు సన్మార్గం పొందడానికి మీ ప్రభువుని అర్థించండి. గుడ్డివాడు అగ్నిగుండంవైపు పోతుండగ చూస్తున్నవాడు. నీవు అగ్నిగుండం వైపు పోతున్నావని హెచ్చరించడం లేదు. మరి ఆ మనిషికి నేను మనిషినని చెప్పుకునే అర్హత ఉంటుందా? మానవత్వం ఏమిటంటే, అతణ్ణి వారించాలి. అటువైపు పోకుండా ఆపాలి. అతడిని పట్టుకుని నిన్ను నేను ఏ మాత్రం అగ్నిలో పడనీయను అని పంతం పట్టాలి. ఇస్లాం ధర్మం, ప్రవక్త అనుసరణ. దివ్య ఖుర్ఆన్ అనుగ్రహం లభించిన ముస్లింల హక్కు ఏమంటే, వారు షిర్క్ కుఫ్ర్* ల అగ్నిలో ఇరుక్కుపోయిన వారిని రక్షించడంలో హక్కు నిమగ్నమవ్వాలి. వారి చేతులు కాళ్ళు పట్టుకునైనా ఈమాన్ దారి వదలిపెట్టోద్దని బ్రతిమిలాడాలి. ప్రజలు విశ్వాసానికి ప్రతికూలంగా చెడు మార్గాన పోకుండా చూడాలి. నిస్వార్థంతో, నిజమయిన సానుభూతితో చెప్పిన విషయాలు హృదయంపై ప్రభావం వేస్తాయి. మీ వల్ల ఒక్క మనిషైనా సృష్టికర్త గుమ్మంలోకి ప్రవేశిస్తే మీరు గట్టెక్కినట్లె, కుఫ్ర్ నుండి, షిర్క్‌నుండి, తప్పించి సన్మార్గం పైతీసుకువచ్చేవారి పట్ల అల్లాహ్ ప్రసన్నుడవుతాడు. ఎలా అంటే మీ కుమారుడు మీకు విరోధిగా మారి మీ శత్రువులతో కలసి వారి మాటే వింటుంటే ఒక సజ్జనుడు అతనికి హితవు చెప్పి మీ విధేయునిగా చేస్తాడు. అప్పుడు మీరు ఆ సజ్జనుని పట్ల ఎంతగానో ఆనందాన్ని వెలిబుచ్చుతారు

అలాగే ఇతరుల దాకా "ఈమాన్" (విశ్వాసం) చేరవేసిన వ్యక్తి పట్ల అల్లాహ్ అంతకంటే అధికంగా ప్రసన్నుడవుతాడు.

## విశ్వసించిన తరువాత

ఇస్లాం స్వీకరించిన తరువాత మీరు మీ ప్రభువుకు నిజమైన దాసునిగా మారిపోతారు. అప్పుడు మీరు ప్రతి రోజు ఐదు పూటల నమాజ్ చేయాలి. మీరు నమాజ్ నేర్చుకుని దైనందిన జీవితంలో దానిని తప్పనిసరి విధిగా నిర్వర్తిస్తూ ఉండాలి. దాని వల్ల ఆత్మకు శాంతి లభిస్తుంది. అల్లాహ్ తో అనుబంధం ఏర్పడుతుంది. రమజాను మాసం వచ్చిందంటే ఆ నెలంతా ఉపవాస దీక్ష

* కుఫ్ర్ అంటే సత్యాన్ని సత్యమని సాక్ష్యం పలికిన తరువాత దానిని వ్యతిరేకించడం. కుఫ్ర్ నుండి వచ్చిన పదం కాఫిర్. కాఫిర్ అంటే తిట్టు కాదు, కాఫిర్ అంటె సత్యాన్ని తెలుసుకున్న తరువాత దానిని వ్యతిరేకించిన వాడు(అనువాదకుడు)

పాటించాల్సి ఉంటుంది. ధనవంతులయితే జీవితంలో ఒక సారి హజ్‌యాత్ర చేయాల్సి ఉంటుంది. జాగ్రత్తా! ఇక మీ తల (శిరస్సు)ను అల్లాహ్ ముందు తప్ప ఎవరి ముందు వంచకూడదు. మీపై సారాయి, జూదం, వడ్డీ (మిత్తి), పందిమాంసం, లంచం, అధర్మమయిన వస్తువులు నిషేధించబడ్డాయి. వాటికి దూరంగా ఉండాలి. అల్లాహ్ ధర్మసమ్మతమయినవని చెప్పిన వస్తువులను ఉత్సాహంతో ఉపయోగించాలి.

తన ప్రభువు తరపు నుండి పంపబడిన గ్రంథాన్ని ప్రతి రోజు పఠిస్తూ ఉండాలి. పవిత్రత, పరిశుద్ధతల నియమాలను నేర్చుకోవాలి. నిష్కల్మష హృదయంతో ఇలా ప్రార్థించాలి. "ఓ మా ప్రభువా! మమ్మల్ని, మా స్నేహితుల్ని, మా బంధువులను, ఈ భూమండలంపై నివసించే మానవులందరినీ విశ్వాసంపై ఉంచు. విశ్వాసంపై లేపుకో."

మానప సమాజానికి ఆరంభంలోనూ అంతిమంగానూ ఉండే తోడు వీశ్వాసమే." దైవ ప్రవక్త ఇబ్రాహీం మండుతున్న అగ్నిలోకి విశ్వాసం వల్లనే దూకారు. అందువల్లనే ఆయన అగ్ని నుండి సురక్షితంగా బయటకు రాగలిగారు. ఈనాడు కూడా విశ్వాస శక్తి అగ్నిని సయితం పువ్వులుగా మార్చగలుగుతుంది. సత్య మార్గంలో ఉన్న అవరోధాలను అది అంతం చేయగలుగుతుంది.

ఇబ్రాహీమ్‌లో ఉత్పన్నమైన ఈమాన్ నేడు ఉంటె
అగ్ని విరాజిల్లుతుంది నేడుకూడా పూదోటవలె

**రచన: మౌలానా మొహమ్మద్ కలీం సిద్దీఖీ**
పోస్ట్: ఫులత్, ముజఫర్‌నగర్. (యు. పి.)

**ప్రచురణ:**

**ఇదార హిఫ్జుల్ ఖుర్ఆన్ కరీంనగర్.**
సెల్: 9391647031, 9394596898